# అవతారిక.

పూర్వకాలంబున కైలాసపర్వతమందు పార్వతీపరమేశ్వరులు తమభక్తబృందముతో గూడి బ్రహ్మానందసుఖ మనుభవించుచుండగా, ఒకానొకసమయంబున పార్వతీదేవి పరమేశ్వరుని భక్తిప్రపత్తులతో సేవించి లోకంబున నిబద్ధులకు మోక్షసాధనంబైన మహామంత్రము నుపదేశింపుమని ప్రార్థించిన భక్తవత్సలుండయిన పరమేశ్వరుండు శ్రీరామహృదయంబను పురాతనేతిహాసంబుగ్రహించిన ముముక్షువులకు వైరాగ్యభక్తిజ్ఞానంబులు లభించునని శ్రీరామహృదయంబుపదేశించిన వది సీతారామాంజనేయసంవాదంబని చెప్పఁబడుచున్నది. ఈ ప్రబంధము పద్యకావ్యంబైనను సంస్కృతతుల్యంబై చదువరులకు యథార్థంబు తెలియఁబడకుండుటవలన, నీగ్రంథంబును ప్రశ్నోత్తరరూపంబునఁబ్రకటించిన, యర్థాంతరంబు సులభంబగు

నని నిశ్చయించి యీమహాగ్రంథంబును వచన రూపంబుగ రచించితిఁగావున లోకంబున సద్భక్తులయిన పుణ్యాత్ములు శ్రీరామ హృదయంబును నిరంతరము పఠించి జన్మసాఫల్యమొందుదురుగాక.

ఇట్లు సుజనవిధేయుడు,

సూర్యనారాయణశర్మ.

శ్రీరస్తు

శ్రీగురుభ్యోనమః

# శ్రీరామహృదయము

## సాంఖ్యయోగము.

### ఉపదేశప్రకరణము

శా. శ్రీమద్దివ్యనిజాంఘ్రిపద్మములు సంసేవింపు చుం భక్తిచే । ధీమంతుండగు నాంజనేయుని సవద్ధే హొందఁబ్రియాలీలచే । న్వ్యామాసంపద వీవనేనని కృపం బోధించు శ్రీజానకీ । రామబ్రహ్మము సంతతంగ మనసా రాధింతు నశ్రాంతమున్ ।

అనగా నే పరమాత్ముడు విశ్వమయుడై ప్రకాశింపుచు నిజభక్తుండైన హనుమంతునకు సద్గురు రూపంబున ప్రసన్నుండై ఆత్మజ్ఞానము నుపదేశించి జీవన్ముక్తి నొందించెనో అటువంటి శ్రీరామచంద్ర మూర్తికి అనేకమంగళాచరణంబులు గావించి గ్రంథ ప్రారంభము చేయుచున్నాడని, తాత్పర్యము.

1 ప్ర॥ సీతారామాంజనేయసంవాదమనగా నెట్టువంటిది? ఉ. త్రేతాయుగంబున దశరథపుత్రుండైన, దేవుండు భూభారహరణార్థమై, లోకంబున నవతరించి శ్రీరామచంద్రుండను సార్థకనామము ధరించి, దుష్ట రాక్షసులను వధించి, భూభారము నివారించి, పరమ భాగవతోత్తముండైన శ్రీ యాంజనేయమూర్తికి శ్రీరాముండును, సీతాదేవియును, గురుశిష్యసంవాద రూపంబున బ్రహ్మవిద్యనుపదేశించి జీవన్ముక్తి నొందించుటవలన యీ గ్రంథము సీతారామాంజనేయసంవాదమని చెప్పబడుచున్నది.

2 ప్ర. సీతారామాంజనేయులనగా నెట్టువంటి వారు? అకల్పితస్వయంప్రకాశమైన అద్వితీయబ్రహ్మమే శ్రీరాముండును, అపరబ్రహ్మశక్తియైన మూలప్రకృతియే సీతాదేవియును. అప్రకృతి గుణసంభవుండైన జీవుండే ఆంజనేయుండును అని యంతరార్థము.

3 ప్ర. శ్రీరామహృదయమనగా నెట్టువంటిది? చరాచరప్రపంచము ప్రకృతిగుణములవలన కల్పితమై ప్రతిజీవయంత్రములోను అంతర్యాముండు వాయు రూపంబున చలించుటయు, మాయాసీత మనోరూపం

బున సంకల్పించుటయు, ఆత్మారాముండు సర్వసాక్షి
యై గ్రహించుటయు. అందువలన సర్వజీవయంత్రం
బులును స్త్రీపురుష రూపంబులై నటించుచున్నవని
వసిష్ఠ మహర్షి శ్రీరామచంద్రున కుపదేశించినదే
శ్రీరామహృదయము

4 ప్ర. బ్రహ్మవిద్యయనగా యెటువంటిది? రాజ
యోగానుభవమువలన జీవన్ముక్తి నొందించునదే బ్ర
హ్మవిద్య.

5 ప్ర. రాజయోగమనగా యెటువంటిది? సాం
ఖ్యతారకామనస్కాభ్యాసంబులచే స్వస్వరూపము నెరి
గించునదే రాజయోగము.

6 ప్ర. సాంఖ్యతారకామనస్కంబు లెటువంటివి?
ఆత్మానాత్మవివేకంబైన ఉపదేశప్రకరణము సాంఖ్య
యోగమనిన్ని, ఆత్మసాక్షాత్కారసాధనంబైన ఉ
పాసనాప్రకరణము తారకయోగమనిన్ని, ఆత్మానుభ
వ సాధనంబైన జీవన్ముక్తిప్రకరణము అమనస్క
యోగమనిన్ని చెప్పబడుచున్నది.

7 ప్ర. సాంఖ్యయోగానుభవ మెంటువంటిది?
ఆత్మానాత్మవస్తువుల నెరిగించెడి పరోక్షజ్ఞానమే
సాంఖ్యయోగము.

8 ప్ర. ఈదేహాది ప్రపంచమెట్లుకలుగుచున్నది? అఖండ సచ్చిదానంద పరబ్రహ్మమునందు మాయ వలన జీవేశ్వర జగత్తులు కల్పితములగుచున్నవి.

9 ప్ర. జీవుండనగా యెటువంటివాడు? అఖండ వ్యక్తియైన పరమాత్మ యొక్కడే ప్రతిశరీరములోను సాక్షిమాత్రుండై యుండియును తనసంకల్పశక్తియైన అహంవృత్తితోఁ గూడి నామరూపశరీరము తానని ధరించువాడే జీవుడు.

10 ప్ర. ఈశ్వరుడనగా యెటువంటివాడు? అఖండవ్యక్తియైన పరమాత్మయే తనమూల ప్రకృతియైన సంకల్పశక్తిని వశపరచుకొని సర్వలోకములను సృజించి పరిపాలించువాడే ఈశ్వరుడు.

11 ప్ర. జగత్తనగా యెటువంటిది? అస్తి, భాతి, ప్రియము, రూపము, నామము, యీపంచ లక్షణములచే ప్రకాశించునదే ప్రపంచము.

12 ప్ర. ఆపంచలక్షణము లెటువంటివి? అస్తి భాతి ప్రియములు మూడును సచ్చిదానంద బ్రహ్మ లక్షణములనిన్ని నామరూపములు రెండున్ను మాయాలక్షణములనిన్ని చెప్పబడును. అందు అస్తి యనగా కలదని భాతియనగా ప్రకాశించుచున్నదని

ప్రియమనగా యిష్టమైనదని రూపమనగా ఆకారము గలదని నామమనగా పేర్కొనబడుచున్నదని గ్రహించునది.

13 ప్ర. ఆత్మానాత్మ వివేక మెటు వంటిది ? మాయా బ్రహ్మములకు స్వరూప స్వభావ పరిమాణ ఉత్పత్తి స్థితిలయములను విమర్శించునదే ఆత్మానాత్మ వివేకము.

14 ప్ర. బ్రహ్మలక్షణ మెటువంటిది ? పరంజ్యోతి యే స్వరూపమైనదిన్ని, సచ్చిదానందమే స్వభావముగలదిన్ని, ఆదిమధ్యాంతములు లేనిదన్ని, ఉత్పత్తి వినాశంబులు పొందనిదన్ని, అఖండవ్యక్తియై ప్రకాశించునదియే బ్రహ్మవస్తువు.

15 ప్ర. మాయాలక్షణ మెటువంటిది ? సంకల్పమే స్వరూపమైనదిన్ని, అనృతజడ దుఃఖములే స్వభావముగలదిన్నీ, ఆది, మధ్య, అంతము, రూపము, నామము, గుణము, పరిమాణము గలదిన్నీ ఉత్పత్తి స్థితిలయములను పొందునదిన్నీ జగద్రూపమై గనుపించునదే మహామాయ.

16 ప్ర. తన శరీరములో నున్న మాయాబ్రహ్మములను తానెట్లు గ్రహింపవచ్చును ? ప్రతిశరీరము

లోను ప్రకృతిపురుషులై వృత్తిజ్ఞప్తులై జీవేశ్వరులై అభిన్నముగానున్న దేహాత్మలను మాయాబ్రహ్మము లని గ్రహించి పంచవింశతి తత్వములను భేదించి అధిష్టానపరతత్వమును తానుగా దర్శింపవలెను.

17 ప్ర. పంచ వింశతి తత్వంబు లెటువంటివి ? పంచభూతంబులు పంచవిషయంబులు పంచకరణంబులు దశేంద్రియంబులు అన్నియును గూడినదే పంచవింశతి తత్వపుంజము.

18 ప్ర. పంచభూతంబులెవ్వి ? భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, నీరైదును మహాభూతము లనబడును.

19 ప్ర. పంచవిషయంబులెవ్వి ? శబ్దము, స్పర్శము, రూపము రసము. గంధము, నీరైదును భూతగుణంబులనబడును.

20 ప్ర. జ్ఞానేంద్రియంబు లెవ్వి ? శ్రోత్రము త్వక్కు చక్షువు జిహ్వ ఘ్రాణము. నీరైదును జ్ఞానేంద్రియంబు లనబడును.

21 ప్ర. కర్మేంద్రియంబులెవ్వి ? వాక్కు పాణి పాదము గుదము గుహ్యము నీరైదును కర్మేంద్రియములనబడును.

22 ప్రః పంచ కరణంబులెవ్వి ? సర్వసాక్షియైన జ్ఞాత, సంకల్పరూపమయిన మనస్సు, నిశ్చయరూపమైన బుద్ధి, విచారణరూపమైన చిత్తము, అభిమానరూపమైన హంకారము, నీయైదును పంచ కరణంబులన బడును.

23 ప్రః ఈ పంచవింశతితత్వములలోను తానైన పరతత్వమేది ? చతుర్వింశతితత్వంబులైన దేహమే క్షేత్రమనిన్ని క్షేత్రజ్ఞుడైన ఆత్మయే పరతత్వమనిన్ని చెప్పబడును.

24 ప్రః అఖండ వ్యక్తియైన పరమాత్మకు అజ్ఞాన జీవభ్రాంతి యెట్లువచ్చును ? మాయాకల్పితమైన అంతఃకరణమందు పరమాత్మ ప్రతిఫలించి ఆపరమాత్మయున్ను ఆప్రతిబింబమున్ను అంతఃకరణమున్ను గలసి జీవుండై తన స్వరూపమును మరచి దేహము తానని తలంచుటవలన జీవభ్రాంతి నను భవించును.

25 ప్రః ఇట్టి జీవభ్రాంతి యెట్లు నివర్తించును ? అధిష్ఠానజ్ఞానముచేతగాని ఆరోపితభ్రమ నశింపదు

26 ప్రః అధిష్ఠానజ్ఞాన మెటువంటిది ? తనయందున్న అఖండ సచ్చిదానంద పరబ్రహ్మలక్షణంబు

లను తాను గ్రహించునదే అధిష్ఠానజ్ఞానము.

27 ప్ర॥ ఆత్మయందున్న అఖండలక్షణమెటువంటిది? సర్వచేతనాచేతన రూపములలోను చిదాకాశస్వరూపమైన పరమాత్మయొక్కడే ప్రకాశించుటవలన ఖండవ్యక్తమైన ప్రత్యగాత్మయే అఖండస్వరూపుడనబడును.

28 ప్ర॥ తనయందున్న సద్రూపలక్షణమెటువంటిది? ఈజగత్సాక్షియైన పరమాత్మయే జీవసాక్షియై జగత్త్రయమందు నశింపకుండుటవలన తానే సత్యస్వరూపుడనబడును.

29 ప్ర॥ తనయందున్న చిద్రూపలక్షణ మెటువంటిది? తనకు దృశ్యములైన అంతర్బాహ్యస్వరూపములను యేసాధనము లేకనే ప్రజ్ఞామాత్రమై తనంతట తానే గ్రహించుటవలన తానే చిత్స్వరూపుడనబడును.

30 ప్ర॥ తనయందున్న ఆనందలక్షణ మెటువంటిది? సర్వవిషయానుభవములకును ఆత్మయే ప్రేమాస్పదమయినందున, సర్వాధిష్ఠానమైన తానే పరమానందస్వరూపుడనబడును.

31 ప్ర॥ అఖండ సచ్చిదానంద పరబ్రహ్మమైన

తనస్వరూపానుభవము తనకెట్లుకలుగును? సాధన తురీయసమాధివలనంగాని బ్రహ్మానందానుభవంబు గలుగనేరదు.

32 ప్ర॥ తురీయసమాధిలక్షణ మెటువంటిది? సాధనసంపత్తివలన పూర్ణాధికారియై బ్రహ్మనిష్ఠ యుందుండుసమయంబున తనకు దృశ్యమానంబైన దేహప్రపంచము తానుగాదని నిషేధించి తాను దేహసాక్షియైన జీవుండని నిశ్చయించి అంతట జగత్సాక్షియైన పరమాత్ముడే జీవాత్ముడని దేహసాక్షియైన జీవాత్ముడే పరమాత్ముడని గ్రహించి వృత్తిరహితుడైయుండునదే సాధనతురీయసమాధియని చెప్పబడుచున్నది

అని యివ్విధంబున శ్రీరామచంద్రుండాంజనేయునకు సాంఖ్యయోగంబుపదేశించి తన దక్షిణహస్తంబగని శిరంబునందుంచి యేతెలివిచేత నీహస్తమస్తకసంయోగంబు నీకెరుగబడుచున్నదో ఆ తెలివియే పరబ్రహ్మస్వరూపమని స్వస్వరూపంబుజూపించిన నయ్యాంజనేయుండు తనహృదయపద్మమునందు పరంజ్యోతిస్వరూపుండై ప్రకాశించుచున్న ఆత్మారాముని దర్శించి పరమానందయుండై కృతార్థుండై బ్రహ్మ

నందసముద్రంబున మునింగి చిత్రప్రతిమవలె నిశ్చేష్టితుండై తనువు మరచి తన్మయత్వంబు జెంది కొంత తడవు సమాధియందుండి మరల మేల్కాని తన యెదుటనున్న శ్రీరామచంద్రునకు మూర్తి నిదర్శించి గద్గదకంఠుండై యిట్లు వినుతించుచున్నాడు.

సర్వభూతహృదయాంతర్వర్తియును సకల బ్రహ్మాండాంతర సర్వేంద్రియములకు విశ్వమే నిమయము మైయున్నది. నీవు విశ్వమయుడవై యున్నావు. నీ స్వరూపసందర్శనమువలన నాకాత్మసందర్శనమై నీ కంటె విశ్వము వేరనెడి నాయజ్ఞానమంతయు నివర్తించి ఆనందమయుడనై యుంటినిగాని నీవిశ్వరూపస్మరణ జ్ఞానభావన నిరంతరము నాకు గలిగియుండునట్లు వర మొసంగవలయు.

మరియును నీవు చతుర్వింశతితత్వములకు ప్రభువై, ప్రకృతికంటె పరమై, జగత్తుకు గురువై సర్వపరిపూర్ణుడవై నాకు సాక్షాత్కరించుటవలన ఘటాకాశము మహాకాశముకంటె వేరుగాక యేక మైనట్లు జీవుండనైననేను దేవుండవైన నీకంటె వేరుగానని దృఢనిశ్చయము నీయనుగ్రహమువలన లభించినదిగాని అనాదిమూలాజ్ఞానశక్తి వలన మరల

జీవభ్రాంతిగలుగక ఇట్టిపరిపూర్ణ జ్ఞానము నాకెల్లప్పు డును గలిగియుండునట్లు నన్నాశీర్వదింపుమని అంజ నేయుండనేకవిధంబుల శ్రీరామచంద్రుని స్తుతించిన శ్రీరామచంద్రుండు సీతాదేవినింజూచి యితనికి తారకయోగంబుపదేశింపుమని యానతిచ్చిన జానకీ దేవి హనుమంతునకు యికముందు తారకయోగంబు పదేశించుచున్నదని తాత్పర్యము.

ఇట్లు శ్రీరామహృదయంబను మోక్షగ్రంధా బున ఉపదేశప్రకరణంబైన సాంఖ్యయోగము స మాప్తము.

# శ్రీరామహృదయము.

## తారకయోగము.

### ఉపాసనాప్రకరణము.

1 ప్ర. తారకయోగమనగా యెటువంటిది?
ముముక్షువులకు సగుణనిర్గుణోపాసనావిధులచే తారకబ్రహ్మమును దర్శింపజేయునది.

2 ప్ర॥ అందు సగుణోపాసనావిధి యెటువంటిది?
జగత్కర్తయైన భగవంతుని తనయిష్టదైవముగ నమ్మి తన్మంత్రోపాసన ధ్యానపూజనవందనాదులచే నారాధించునదే ఈశ్వరోపాసన.

3 ప్ర. తారకమంత్రోపాసనవిధి యెటువంటిది?
ఈశ్వరోవాచ శ్లో॥ శ్రీరామరామరామేతి రమే రామే మనోరమే సహస్రనామతత్తుల్యం రామనామ వరాననే॥

అని పార్వతీదేవికి పరమేశ్వరుండుపదేశించినట్లు మంత్రసిద్ధుండైన సద్గురునివలన తారకమంత్ర

మును సంగ్రహించి నిరంతరాభ్యాసముచే మంత్ర
సిద్ధిని పొందునది.

4 ప్ర. తారకమంత్రప్రభావమెటువంటిది?

శ్లో॥ శ్రీరామనామామృతమంత్రసారం సంజీవ
నం చేన్మనసిప్రవిష్టం । హాలాహలంవా ప్రళయాన
లంవా మృత్యోర్ముఖంవా విశతాంకుతోభీః॥ 3॥

అనునట్లు తారకమంత్ర సిద్ధుండైనవానికి
వాక్సిద్ధిగలిగి సంకల్పసిద్ధియు మృత్యువును జయించి
ఈశ్వరత్వము సిద్ధించుటవలన లోకంబున తారకమం
త్రము కల్పవృక్షముపంటిదని బరిగణింపబడుచున్నది.

5 ప్ర॥ నిర్గుణోపాసనావిధి యెటువంటిది.

శ్రు॥ దహ్రంవిపాప్మం । పరవేశ్మభూతం
యత్పుండరీకం । పురమధ్యసంస్థం।
తత్రాపిదహరం । గగనంవిశోకం
యస్మిన్యదంతః । దుపాసితవ్యం॥

అనునట్లు॥ తనహృదయపద్మమునకునడుమ దహ
రాకాశమను బుద్ధిగుహయందు పరంజ్యోతిస్వరూప
మైయున్న అంతరాత్మను తనస్వరూపముగా దర్శిం
చునదే పరబ్రహ్మోపాసన.

6 ప్ర॥ బ్రహ్మనిష్ఠనగా నెటువంటిది?

పంచముద్రాలక్ష్యంబులచే నాదబిందుకళానుభవము చేయుచుండుననదే బ్రహ్మనిష్ఠ.

7 ప్ర॥ పంచముద్రలనగా నెటువంటివి? ఖేచరీ, భూచరీ, మధ్యమ, షణ్ముఖి, శాంభవీ యనునవి పంచముద్రలనబడును.

8. ప్ర॥ అందు ఖేచరీలక్ష్యమెటువంటిది? నేత్రములు మూసిగాని తెరచిగాని దృష్టినిమరలించి భ్రూమధ్యమందు నిలిపి మీఁదిభాగమందున్న చిదాకాశమును జూచుచుండునది ఖేచరీముద్ర.

9 ప్ర॥ భూచరీలక్ష్యమెటువంటిది? నేత్రములు కదలింపక నాసికాగ్రమందు దృష్టినిలిపి చూచుచుండు నది భూచరీముద్ర.

10 ప్ర॥ మధ్యమాలక్ష్యమెటువంటిది?

తననేత్రములను సగముమాత్రము మూసి దృష్టిని నాశికంబునదుమనిలిపి తనయాత్మను దర్శించునది చిన్మయముద్ర.

11 ప్ర. షణ్ముఖలక్ష్యమెటువంటిది?

చెవులును కన్నులను ముక్కును చేతులతో మూసి మనసునంతర్ముఖముచేసి, భ్రూమధ్యమందు దృష్టినిలిపి నాదబిందుకళలను చూచునది షణ్ముఖముద్ర

12 ప్ర॥ శాంభవీలక్ష్యమెటువంటిది? నేత్రము లనుదెరచి యింద్రియంబులజయించి చిత్కళలను దర్శించునది శాంభవీముద్ర.

13 ప్ర॥ నాదబిందుకళానుభవమెటువంటిది? ప్రాణవాయువులధ్వనియే ప్రణవనాదమున్ను మన స్సాక్షియైనబుద్ధియేబిందువున్ను ఆత్మప్రతిబింబమే కళ యున్ను అయినందున ప్రాణవాయువునునాదమందు గలిపి ఆనాదమునుబిందువుతోజేర్చి యాబిందువును చిత్కళతోగూర్చి యాచిత్కళను ఆత్మయందైక్యము జెందించిన యింద్రియమనంబులుజయించి అఖండ సచ్చిదానందపరబ్రహ్మముతానై ప్రకాశించునదియె బ్రహ్మానందానుభవము.

14 ప్ర॥ హంసతత్వమనగా యెటువంటిది?

హకారము, సకారము, బిందువు మూడు నుంగలసి హంసయనబడును. వీనిలో హకారముపురు షుండని, సకారము ప్రకృతియని,యారెంటిసంయో గమేబిందువని చెప్పబడుచున్నది.

15 ప్ర॥ ప్రకృతిపురుషలక్షణము లెటువంటివి? దేహేంద్రియ ప్రాణాంతఃకరణరూపమై దృశ్యమై జడమై సత్వరజస్తమోగుణస్వభావమై అనాదియై

వికారస్వరూపమైన సంకల్పశక్తియే ప్రకృతియనిన్ని
నాదబిందుకళలకధిష్ఠానమై ప్రకృతికివిలక్షణమై సర్వ
మునకుద్రష్టయై బుద్ధికిసాక్షియై జ్ఞానస్వరూపమై పరం
జ్యోతియైనపరమాత్మయే పురుషుడనిన్ని చెప్పబడును.

16 ప్ర॥ ప్రకృతిపురుషుల సంబంధమెటువంటిది?
చతుర్వింశతితత్వస్వరూపిణియైన ప్రకృతిన్ని పంచవిం
శతితత్వంబైన పురుషుండునుగలసి హంసస్వరూపమై
చరించుటవలన జీవహంసయనబడును.

17 ప్ర॥ ఇట్టిజీవహంస పరమహంసయెట్లగును?
సర్వజీవులహృదయములయందును మనోమారుతము
లతోగూడి సోహంసోహమని పలుకుచున్న ఆత్మయే
జీవుడని యీరహస్యమునుగుర్తెరిగి ఐక్యభావము
నొందుచుండిన జీవహంస పరమహంసయగును.

18 ప్ర॥ హంసలయస్థానమెద్ది?
సుషుమ్నానాడియందు అచలహంసజనించి
యిడాపింగళనాడులవెంటచలించి యెచ్చట లయించు
చున్నదో అదే పరమపదమైనబ్రహ్మస్థానము.

19 ప్ర॥ హంసతత్వానుభవమెటువంటిది?
ఇట్టిజీవహంస నాదబిందుకళలతోగూడి మ
నోమారుతంబులతో ఆత్మయందులయించిన సర్వ

వర్థ సహజామనస్కమనబడును. అట్టిప్రాణాపానసమాధి
యందు తారకబ్రహ్మము తానై ప్రకాశించుచున్నదే
సహజామనస్కరాజయోగసమాధి.

20 ప్ర. జీవేశ్వరైక్యమెటువంటిది?

అఖండసచ్చిదానంద పరబ్రహ్మవస్తు వొక్క-
టియే బ్రహ్మాండశరీరములో సర్వసాక్షియై సర్వత్ర
ప్రకాశించుటవలన సర్వజ్ఞుండైన ఈశ్వరుడనిన్ని
పిండాండశరీరములో మనస్సాక్షియై ప్రకాశించుట
వలన కించిజ్ఞుండైన జీవుండనిన్ని ఉపాధిభేదంబులచే
ద్వైతవృత్తిగలుగుచున్నందున దేహసాక్షియైనతానే
జగత్సాక్షియయిన ఈశ్వరుండని అద్వైతసిద్ధిబొందు
టయే జీవేశ్వరైక్యము.

21 ప్ర॥ జీవబ్రహ్మైక్యమెటువంటిది? అకల్పితస్వ
యంవ్యక్తమైనఆదిపరబ్రహ్మము అనాదిమూలప్ర
కృతియయిన మాయయందు ప్రతిబింబించి మాయో
పాధికుడైనందున ఈశ్వరుండనిన్ని అవిద్యయందు ప్రతి
బింబించి అవిద్యోపాధికుడైనందున జీవుండనిన్ని చెప్ప
బడుటవలనజీవేశ్వరతత్వంబులు రెండును మాయాకల్పి
తంబులనిగ్రహించి అధిష్టానచైతన్యంబైనప్రత్యగా
త్మయే పరమాత్మయని నిశ్చయించి సాక్షిరహిత

ద్వయుం ప్రకాశశుద్ధచైతన్యమాత్రుండై ప్రకాశించు
నదే జీవబ్రహ్మైక్యమని తాత్పర్యము.

అని యిట్లు జానకీదేవి తారకయోగము నుప
దేశించిన హనుమంతుండు తారకయోగానుభవము
వలన శివజీవైక్యసమాధిం జెంది తారకబ్రహ్మమును
దర్శించి తన్మయత్వము నొంది సమాధినుండి మేల్కాంచి
జానకీదేవి నిట్లు వినుతించుచున్నాడు.

బ్రహ్మవిద్యాస్వరూపిణివైన ఓ జగన్మాతా నీ
యనుగ్రహంబువలన తారకబ్రహ్మమైన ఆత్మతా
ముని దర్శించితిని లోకంబున బ్రహ్మవిద్య లేకుండిన బ్ర
హ్మాదులైనను తారకబ్రహ్మమును దర్శింపజాలరు.
పరబ్రహ్మశక్తివైన నీవు లోకంబున కల్పవృక్షమువలె
నుద్భవించి జన్మమృత్యు సంసారసాగరనిమగ్నుల
యిన జీవకోట్లను పునరావృత్తిరహిత శాశ్వతమోక్ష
సామ్రాజ్యమును బొందింపుచున్న నీ మహామహిమ
నెంతని వర్ణింపవచ్చును.

అకల్పితస్వయంవ్యక్తమైన ఆదిపరబ్రహ్మము
నందు అనాదిమూలప్రకృతివైన నీవు జగత్సృష్టికి పూ
ర్వము అభిన్నమైయుండి జగత్కారణశక్తివై పర
బ్రహ్మమునుండి వ్యక్తమై బ్రహ్మవిష్ణుమహేశ్వరమూ

వంబులనవతరించి జగన్నాటకసూత్రధారివై పరబ్ర
హ్మవిలాసంబుగల్పించిన నీయనంతశక్తి యెంతని కొని
యాడవచ్చును.

పరంజ్యోతిస్వరూపుండైన పరమాత్మకు సచ్చి
దానంద ప్రకృతివై యావరించి పరబ్రహ్మముతో
నీవారమించుచుందువు. అందువలన నిర్వికారుండైన
పరమాత్మ నీయందుగలసి నీవు ఆనందమయమై యుండి
న పరబ్రహ్మము ఆనందమయుడై యుండును బ్రహ్మశ
క్తివైన నీవు దుఃఖమయమైయుండిన పరబ్రహ్మము
దుఃఖమయుడై యుండును. మూలప్రకృతివైన నీవు
నిర్వికారమై యుండిన పరమాత్ముడును నిర్వికారుడే
యగును. నీవు సవికారమై యుండిన పరమాత్ముడున్ను
సవికారుడే యగును నీవుజ్ఞానస్వరూపమైన పరమాత్మ
డున్ను జ్ఞానస్వరూపుడే యగును. నీవు జడస్వరూపమై
న పరమాత్ముడున్ను జడస్వరూపుడే యగును. నీవు
అమృతస్వరూపమైన పరమాత్మయును అమృతస్వరూ
పుడే యగును. నీవు నిద్రాస్వరూపమైన పరమాత్మయు
ను నిద్రాస్వరూపుడే యగును. నీవు జగద్రూపమైన పర
మాత్మయును జగద్రూపుడే యగును నీవు దేహ
రూపమైన పరమాత్మయును దేహరూపుడే యగును. నీవు

సర్వసాక్షియైన పరమాత్మయగుచు సర్వసాక్షియగుచు
న్నట్టి నటచేతనిర్గుణపరబ్రహ్మమైన శ్రీరామచంద్రుం
డు మూలప్రకృతియైన నీయనుగ్రహమువలనభక్తులకు
ఆత్మరూపంబున ప్రసన్నుడగుచున్నాడుగాని నీప్రసన్న
తలేక పరమాత్మునుబ్రహ్మాదులకైనను ప్రసన్నుడు
గాడందున మహాలక్ష్మీస్వరూపంబైన నీకటాక్షంబు
నాయందనుగ్రహించి నీబ్రహ్మవిద్యావిలాసంబు నా
హృదయంబున నిరంతరంబు ప్రకాశింపచేయుమని
హనుమంతు డనేకవిధంబుల జానకీదేవిని వినుతించిన
హనుమంతునకు శ్రీరామచంద్రుండు అమనస్క
యోగంబుపదేశించుచున్నాడని తాత్పర్యము.

ఇట్లు శ్రీరామహృదయంబను మోక్షగ్రంథము
నందు ఉపాసనా ప్రకరణంబైన తారకయోగము
సమాప్తము.

శ్రీరస్తు.

# శ్రీ రామహృదయము:

## అమనస్కయోగము.

### జీవన్ముక్తి ప్రకరణము.

1 ప్ర॥ అమనస్కయోగమనగా నెట్టువంటిది?
అకల్పితస్వయంజ్యోతియైన ఆత్మకు మాయావరణము లేనందున దేహేంద్రియ మనోరూపంబైన సంకల్పశక్తిని ఆత్మయందైక్యము జేసి జీవన్ముక్తి నొందించునది.

2 ప్ర॥ మనోలయమనగా నెట్టువంటిది? సుషుప్తికాలంబున జీవుండు దేహేంద్రియంబులను విడచి, ఆత్మసాన్నిధ్యంబు జేరి, అజ్ఞానాంధకారంబున సంకల్పరహితుండై, దేహమును మరచియున్నట్లు, జాగ్రదవస్థయందు జీవుండు బ్రహ్మము తానను విజ్ఞానదృష్టిచే దేహేంద్రియ మనంబులను విసర్జించి మనోమాయను నిగ్రహించి వాసనారహితుండై విజ్ఞానమాధుర్యమందు

ఎట్లుకదురువకుండునదే సహజామనస్క రాజయోగము.

3 ప్ర॥ నిర్వికల్పసమాధియనగా యెటువంటిది?

అకల్పితస్వయంబ్రహ్మమైన ఆత్మకు వ్యవహారసమాధులు కాదును మాయాకల్పితంబులై యందున మూలప్రకృతిని జయించి స్వయంప్రకాశచిన్మాత్రుండై వెలయుచుండుట దేవిదేహాకైవల్యము.

4 ప్ర॥ బ్రహ్మకారానైనసమాధియందు మనస్సు కలిగియుండునా లేకయుండునా?

మాయాస్వరూపమైనమనస్సు బ్రహ్మమునకు లేనందున ప్రజ్ఞాసమాధియందు మనస్సంకల్పము ఆత్మయందు లయించిఉండును.

5 ప్ర॥ నియమమైనను మనస్సంకల్పముంచకుండనిచో జీవునకాత్మసమాధియెట్లుసిద్ధించును? జీవుండు పరమాత్మజ్యోతిని దర్శించుచుండిన, సింహమును జూచుగజంబులువలె యింద్రియమనంబులు చలింపకుండును.

6 ప్ర॥ అవాఙ్మానసగోచరంబైన పరమాత్మనెట్లు దర్శింపవచ్చును? నిర్వాసనజ్ఞాననిష్ఠవలనగాని పరబ్రహ్మమును దర్శింపశక్యముకాదు.

